ఆ॥ గొప్పగాలి పలసఁ • గూలిన వృక్షణా, లంబు గల వనంబు • దంబు వంచి
కూలియున్న సైన్య • కోటిని రావణి, పొగిలి పొగిలి విస్తుఁ • జగుచుఁ గాంచె

ఆ॥ కరుల హరుల భటుల • గిరులను విచ్చిన్న, రథచయంబు దనుజ • రక్తనదుల
మృతభటాళి తెప్ప • మేసిన వేతాండు, బయలు గనఁడు పంక్తి • వదన సుతుఁడు.

ఆ॥ వేలకొలఁది దనుజ • పీనుల నొక్కమూస, పుని శరాలి పేఁచ • మరఁచి త్రుంపఁ
గుప్పలైన పీన్గు • లిప్పలు గారుచు, యూనియున్న మొకనిఁ • గానఁదయ్యె.

ఆ॥ నాల్కలెండ మేను • సడలింపంగ నేతెంచి, కొంత అసురు లతనిఁ • గూడినారు
నడవలేక తోడు • పడియుఁ కొందఱు, త్రోవలందె కూలి • దొరినారు.

ఆ॥ కుండమాటిపోవఁ • గుండెలు పగులంగ, నాయుచుంచ ధూమ • మడరు నగ్ని
చెన్నునంది యింద్ర • జితుఁడు జపించు చుం, డ్రమ్మ మరచివచ్చె • రంగమునకు.

ఆ॥ అట్టివేళయందు • హతశేషులైన రా, క్షసులు భీతుఁగుచు • శక్రజితుని
డాయ వెంట మిత్తి • డాసినపగిది వా, నరులు వెంబడించి • యరిగినారు.

ఆ॥ శతసహస్ర పద్మ • సంఖ్యయౌ సైన్యంబు, నిమిషమాత్ర నీల్గి • సమయునంత
లక్ష్మణుని ధనుర్వి • లాసంబు చింతరాయి, సరిత యలతని మపని • కలఁతపఱచె.

ఆ॥ భూమి యొదలు వదలఁ • బొగులు చంపంబైన, రణ పరాక్రమంబు • రాక్షసప్రతతి
కనిన సురలు మునులు • శిరములు తట్టుచు, నవ్వుచుంట గాంచి • నానయొందె.

క॥ మానముచెడ యజ్ఞమ్మున, మానముచెడ మంత్రగతియు • మాఁదగ సేనా
మానముచెడ వంశము స, మ్మానముచెడఁ గుంది సంక్తి • మస్తకసుతుఁడున్.

క॥ సేనలు పొలిసెను మిగిలిన, దానవులుం బొలియ శంక • దగులఁగనేలా?
పూనిక చెడె యాగము నిఁక, మానక సెజపెట్టి పనుట • మాంద్యమె కాదా?

ఆ॥ వేల్మికుండమందు • వేల్చిన యగ్నియుఁ, బొగలతోడ సడఁగె • బోరుసేయ
వచ్చియరులు దనుజ • వరులను చంపిరి, తెల్లమయ్యెఁ జెడుగుఁ • దెలుపు సన్న.

ఉ॥ ఎన్నఁగ వైరి దాపునసె • యిట్లు మగంటిమ ప్రేఁక్రుంపనేల? కా
నున్నది కాకమాన దిది • యోధుల పద్ధతి గాదు తాప్పకా
నిన్నర వానరావళుల • సెక్కటి గెల్వఁగలేని దోర్బల
స్కన్నుఁడ నైతినే పగఱఁ • జంపఁ గడంగక క్రుంగి యుందునే?

ఉ॥ పేలిచి కోలుపోయె నని • వేఁగుచు నూఁగుచు నుండ ఖేచరుల్
మేలిమి దూల్చి సీబలము • మించుట యింద్రునియొద్దనే మమీ!
మాలెనె యింవటంచు నవ • మానవిధంబున గేలిసేయరే?
జాలిశుఁన్ వధింతునని • పట్టుగ రావణి లేచనంతలో

క॥ మడిసెన కరి తురగంబులు, విరిసిన సైన్యములు నగుచు విటతాటముగా
దరఁగూల్చి రగచరులు త, న్నారసిన దనుజులను భీతి • నొంది వడంకన్.

క॥ తాఱుచు నొదుఁగుచుఁ గ్రిందికిఁ, దూఱుచు నడఁగిన సురారి • తుటుములు వాఁడిం
దేఱిన లక్ష్మణశరములఁ, నాఱెన్ జఠరములు వ్రస్సి • యాంత్రము లురలన్.

క॥ నరవరు శరములతో వా, నరు లేసిన తరులు గిరులు • నక్తంచర సా
గరమున గాలియు నుఱుములు, మెఱుములతో దిగిన మొగులు • మెయివడిఁ దోఁచెన్.

క॥ చెల్లాచెదరై సేనలు, త్రుళ్ళగఁ దరువొండు వీచి • దుష్టుల యసువుల్
కొల్లగొను పవనసూనుం, డుల్లసమున నింద్రజితున • కొగి నిట్లనియెన్.

హనుమంతుఁ డింద్రజితు నుపాలంభించుట

ఉ॥ మాయ యసత్యముల్ పెరుఁగ • మాగిలియైన దురాత్మ! నీచ! నీ
మాయలు చెల్లనేమి? జన • మాన్యను చంపకు మన్నతోడనే
కోయుదువే శిరంబు? మఱి • కోసలదేశము కొల్లలాడఁగాఁ
బోయితె పుష్పకంబుపయి? బొంకులమారి! నరాశనాధమా!

శా॥ చక్రవ్యూహముతో నికుంభిలను నీ • చా! చొచ్చుటల్ కాంతుమే?
వక్ర క్రూరతఁ గోసలంబునకుఁ జా • వం బోయి కే? వారలన్
విక్రాంతిం బరిమార్చి వచ్చితివె? నీ • వేల్మల్ కొనల్ సాగెనే?
యక్రోధంబున బుద్ధి సెప్ప విను నా • యంబేని లేదయ్యెనే.

మ॥ ఉరగాధీశుని మించి భూభరము ను • ద్యోగించు సద్ధర్మియౌ
భరతుం గాంచి బలంబు చూపి యతనిన్ • బంధించితే? శంబరా
సురు నిర్జించిన చక్రవర్తి తనయున్ • సుజ్ఞాని శత్రుఘ్ను ని
ర్భర ధైర్యంబునఁ జేరి నీదగు ధను • శ్శౌండిత్యముం జూపితే?

మ॥ అనల జ్వాలలఁ జిమ్ము చక్షుదిశలన్ • వ్యాపించు సౌమిత్రి మా
ర్గణముల్ నీయురమున్ శిరంబు బరులం • గంఠంబు లంఘ్రుల్ కటిన్
దునుమంగా నవరంధ్రముల్ రుధిర మే • దో మాంసముల్ గ్రక్క లం
కను డాకొంచు నొనర్చు జాలములు ని • క్కం బేగెడి న్నేఁటితో.

మ॥ ఫణిపాశంబొ యమోఘ పాశుపతమో • బ్రహ్మాస్త్రమో మాయలన్
గనియౌ వెన్నుని చక్రమో యెదియొ మీ • గౌరవ్య మద్దానిఁ గై
కొని వేంచేయుఁడి చేయుఁడీ యముఁడు మీ • కోసంబు తా వేచియుం
డెను తట్టాడుచుఁ దాపసించటలు నాఁ • డెంబౌనె మీబోఁటికిన్?

చ॥ వరములు మాయలందు నెఱ • వాదితనంబు బలాత్కరించి ని
ర్జరులకడం గ్రహించిన శ • రమ్ములు దేహబలమ్ములున్ యథా
స్థిరముగ నున్నవేకద? గ్ర • సింతుము భ్రమింగుడు మన్న మాత్ర ని
వ్వెరగొని పాఱినారమె? క • వింపక గ్రుక్కడి పక్కి యేలరా?

మ॥ నిటలాక్షుఁడు శిక్షపనుండు హరియున్ • నిర్భీతులై దాసి యొ
క్కటవిన్ గాచిననైనఁ జచ్చుటయె ని • క్కంబయ్యె సీనాఁడు దా
పటి క్రక్కల్ చలియింపకున్నవియె? మీ • ప్రాణాలకున్ ముప్పు సం
ఘటపాటుం గొని తెచ్చుకొంటి రికఁ ద • క్కంజూచినం దప్పునే?

మ॥ నినుచంపన్ శపథంబు చేసె నిట ము • న్నే లక్ష్మణార్యుండు దా
నెను సీసేనల పేఁటలాడె వినుపి • ల్పెం గాచియున్నాఁడు నీ
వొనరింపంగల వేల్మికిన్ గుణరవం • బోంకార మంత్రంబుగా
వినిపించెం దదపేల రమ్ము బలి గా • వింతుం దదీయాగ్నికై.

మ॥ జగదీశుం దొలఁగించు ఘోర రణ య • జ్ఞంబందు నేఁల్పంగ బా
గుగ యోచించియె నిన్ను ప్రాకృతముగాఁ • గొంపోవ సౌమిత్రి యా
శుగుఁడై యాశుగపాణియై వెడలె న • స్తోకానుమోదాత్ములై
నెగడం బర్విరి నిర్నిమేషులును మా • నిశ్రేష్ఠులున్ మింటిపై.

## మేఘనాదుఁడు హనుమనికిం బ్రత్యుత్తర మిచ్చుట

మ॥ అని సామీరి వచింప మండిపడి దై • త్యాధీశ సూనుం డనున్
హనుమా! నాకడ నిట్లు చప్పుడిగ వ్య • ర్థాలాపముల్ సేయఁగాఁ
జనునే? సంగరమందు చచ్చి మరలన్ • సాధించి ప్రాణంబులన్
మును చావొందుట విస్మరించితిరె? మీ • ముగ్ధత్వ మిట్లుండునే?

శా॥ ఆ సౌమిత్రియె వచ్చుఁగాక ధరజా • తాధీశుఁడే వచ్చుఁగా
కే సంజీవనియేని మీకు మరుఁ గా • కేమైన నౌఁగాక నా
చే సంగ్రామమునందు వానర నర • శ్రేణుల్ నిరుత్సాహులై
వేసారం బడుపాటులెల్ల నమరుల్ • వీక్షింపకే యుండరే?

శా॥ చేతం గార్ముక మొప్పఁ సుందర భుజ • స్తోమంబు పొల్పార నీ
కోఁతుల్ మానవులున్ మనోగతులు సం • క్షోభింప నాకంబు దు
ర్భీతిం జొచ్చిన వెంబడించి బహుళా • స్త్రింగూర్చి హింసింతునై
పూఁతల్ పందుల మాఁకులున్ వితగఁ • బోవున్ జాప విక్రమంబగున్.

మ॥ క్రతువిఘ్నం బొనరించి పేరజయముం • గైకొంటిమం చుబ్బుచున్
బ్రతుకుం బొందితిమంచుఁ బ్రేలు ఘన వీ • రమ్మన్యులారా! వృథా
మతి రజ్జుల్ పదురాడుచుండఁ డిడె మీ • మస్తంబులీ సంగర
క్షితిపై దుల్లఁగఁజేయు నాశరము లా • క్షేపించు వాక్యమ్ములై.

ఉ॥ మీపలె నోటితో వదరి • మించి జయించెదు వాఁడు గాఁడు సూ!
రావణి రెండు మాటలు దు • రంబున నోడితి రింత సంభ్రమం

తే॥ పటహ కుంభికామురజ త • మ్మట హుడుక్క, దుందుభులునుతుత్తుంభికల్ • తుడుముఢక్క
కొమ్ములును తిమిలలును సం కులును కలిసి, చెలఁగ నెల్లవారి చెవులఁ • జెవుడు చేసె.

ఉత్సా॥ ద్విరద చయము మీఁద నులియు • భేరిరవముతోడుతన్
బరఁగె వాని ఘీంకృతులును • పట్టెడలను ఘంటికల్
తురగ హేషతోడ మొరసెఁ • దోలుపట్టె గజ్జియల్
విరిసె నేమి రవముతోడ • వీర కటక రావముల్.

సీ॥ శంఖ కాహళ తూర్య • శబ్దముల్ జలద ని, స్వనముతో ఢీకొని • జయము నొందె
కరి హయ రథ సింహ • గర్జనములు పిడు, గుల ఘోషమును మీఱి • గెలుపునొందె
శ్రావ్యవాద్య ధ్వనుల్ • సంగీత రవములు, పీయూష రుచులపై • విజయమందె
నారి రవంబులు • నవ్వు లదల్పులు. కదలి మ్రోఁతను క్రిందు • పడఁగఁజేసె

తే॥ నాల్గు సంరంభంబులంబోలి • నాల్గు తెగల, యెట్టపోగు లేపిన ధూళి • యూడుకడచి
సైన్యవారాశిఁ గను సుర • చంద్రముఖుల, యశ్రువారాశి నొక్కట • నడఁచివైచె.

తే॥ ఇంద్ర సౌధము లనఁదగి • యెసక మెసఁగు, నరదములు వేలకొలఁది త • న్నలమిరాఁగ
గ్రహము లెల్లనుకొలువసా • గరముమీఁదఁ, జెలఁగుగ్రహరాజునానింద్ర • జితుఁడుమెలసె.

తే॥ మెడయు ముక్కును కన్నులు • కడుపు కాళ్లు, ఱెక్కలును గోళ్లు తోఁకయుఁ • జొక్కపడఁగఁ
గొంచ మొగ్గరముం దీర్చి • మించి ప్లవగ, సేన నొరయ రావణియు సం • సిద్ధుఁ డయ్యె.

తే॥ జంభభేది యిచ్చిన కల్ప • జలదరవము, నెనయు వలమురి చిందంబు • దనుజవిభుని
తనయుఁ దొత్తె సుపర్వులు • తల్లడిల్లఁ, గాలఁ కనొంది ప్రాణులు కా • వికలు గాఁగ.

తే॥ తద్రవము చెవిఁబడ నుప • ద్రవమువొంది, సింహ గర్జన మాలించి • చెవరి పాఱు
వారణంబులక్రియ ఱాత • వైచినట్టి, కుండ పెంచిక లట్లయ్యెఁ • గోఁతిమూఁక.

తే॥ శింజినీరవమున వాని • చెవులుప్రీలె. మనసు కలఁగె నుత్సాహంబు • మంటఁ గలిసెఁ
బరుగులిడఁ గాళ్లు తడఁబడెఁ • గరములందు, పొదలు సాధనములు జాఱెఁ • బెదపెరెండె.

తే॥ పవన సుతుఁ డంగదుఁడు రా, ఘవులు విభీషణుఁడు సైన్య • గణ నాయకులున్
రవిసుతుఁడు తక్కఁ దక్కిన, ప్లవగులు త త్తఱిలి విఱుగఁ • బాఱిరి భీతిన్.

క॥ సేనాపతులును రాక్షస, సేనలు ముందునకు సాఁగి • జీమూతంబుల్
పూనిక నలమిన యనువున, వానరులం జుట్టెఁ గడఁక • వర్ధిల్లంగన్.

క॥ హనుమని భుజములపై శ్రీ, వనజదళాక్షుండు వాలి • వరతనయునిపైఁ
గొనకొని లక్ష్మణుఁ డెక్కెను, ఘన సమరోత్సాహ విధము • కడలుకొనంగన్.

క॥ వారల భుజములపై న, వ్వీరవరులు విండ్లుదాల్చి • విశ్రుత ఖగరా
డ్గోరాజులపై రాజిలు, నారాయణ రుద్రులనఁ ద • నర్చిరి కలనన్.

ట్వ్రఁ ముఖులతో పిలిచి • పంపలఁ గోఁతుల జంపఁజూచునే ?
సత్రము కీర్తిగల్గునె? • పంపియుఁ? జూపవె యెందు లక్ష్మణున్

ఉ॥ పావని వైర్యకోత్కట బలం • పారము లేక లెంచినియుంటి రా
ష్ట్రావని పడవేఁటు గని • వానికి మించిన వారిఁబోలె నీ
రావణి పైకి పెట్టుచుఁ • వింతిన కీడులె కాదె మీరు? క్రొం
జేవ గడించి పట్టితిరె? • చేయుఁడు కాసల జీవితార్థులై.

చ॥ మనుజుల నాథుఁ జూపి బహు • మానము లందుఁడీ యంచుఁ బల్కి నా
దనుజు వనేచరుల్ కినిసి • తాల్కొని భూధర భూజ బృందమున్
గొని పయిపంగ రావణి య • ఖండిత సాయక వృష్టిఁజేసి య
వ్వనచర వారముల్ బల జ • పంబులు ద్రుంగి పడుంగ నేసినన్.

చ॥ బలిముఖ మేదినీధ్రముల • పై దనుజాళుగ కల్పమేఘ మ
త్యలఘు తరంబుగాఁ గురియ • సన్నిచర ప్రతతుల్ సళించె నా
బలియుని పేర్మియుం జెడియె • వానిని పెండియుఁ జూచిపోవ నీ
కొలసి వధింపుమా యని ర • ఘూత్తముతోడ విభీషణుం డనెన్.

చ॥ వడివడి లక్ష్మణుండు దశ • వక్త్రి కుమారుని డాయునంత సౌ
ల్మిడి విడఁదేటి మారుతి సు • మిత్రసుతుం గని నా భుజంబులం
దొడిఁబడకుండ నెక్కుమని • తోడనె మూఁపునఁ దాల్చి పేర్మిఁ బె
న్పొడివము బేవిచమ్మ వడి • యుం గొనఁ జేర్చె విచిత్రకేతులన్

## ఇంద్రజి ల్లక్ష్మణుల యుద్ధము

ఉ॥ వేయి మొయిళ్ళు లొక్కటగు • పీఁక నెసంగిన మేఘనాదుఁడున్
వేయి గుఱాలఁ బూన్చిన • పేరిమి గల్గిన తేరి నెక్కఁగా
వేయి వెలుంగు పోఁడిమిని • వీరుఁడు లక్ష్మణుఁ డాజి రాజిలెన్
వేయి మొనల్ల రాజియన • వేడ్కఁ బ్రవర్తిలె నాంజనేయుఁడున్.

చ॥ నిదుర లొలంగినట్టి గుణ • నీరధి లక్ష్మణుఁ డగ్ని లమ్ములన్
బిదురములట్లు వోవునవి • పీడని కర్మము లట్లు లేదు సం
గదయను రోగముం గలవి • కంక నిభంబులు చిత్తవేగమై
పొవలెడు కొన్ని తూపులను • పూనిక నేసె సురారి సూనుపై.

ఉ॥ అట్టివ యన్ని యమ్ములన • రాడ సుతుం దరివోసి యేసి తా
నెట్టన సాగరంబు లవ • నీధ్రము లంబరముల్ దిశాతటుల్
పట్టుగఁ గానరాక యుఁక • బాణములే భువి లేవనంగ మే
ముట్టఁగ నంపవానఁ దగ • నుంచి గుణధ్వనితోడ నార్వఁగన్.

ఉ॥ పిచ్చుక పిండులట్లు మొగి • వెల్వడు తూపుల లక్ష్మణుండు తాఁ
జెచ్చెరనేసి వాని నిర • సించుచుఁ ద్రుంచె; శిలల్ మలల్ తరుల్
పచ్చడిగాఁగఁ ద్రొక్కి లయ • వాయువుఁబోలిన బాసవాళ్ల పె
న్మచ్చరి స్యందనమ్మును స • మంచిత మారుతి పాదయుగ్మమున్.

క॥ ఇరువురు తమయెడఁ గొఱఁతల, సరయంగా లేక సమత • నందుచుఁ బోరన్
బెరలేరు లేరు వీరికి, బోర యని నిర్జరులు వెఱఁగు • దొరసిరి తమలో.

మ॥ శర సందోహము లంబర స్థలమునన్ • జన్పున్నవో లేవొ ని
ర్జర నేత్రంబులు చూడవయ్యె మనసుల్ • జడయ్యె లెక్కింపఁగా
బరిమాణంబున కందవయ్యె నడుమన్ • భంగించి యీఁదేరియున్
జొరదయ్యెన్ వ్రణరాజి దక్క నెదియుం • జూపట్ట దమ్మేనులన్.

తే॥ నెఱసి శింజినీధ్వని నిండు • నింగియందు, పిడుగులంబలె నెగడిన • వేఁడివాఁడి
సెలలు దెసలెల్లఁ బొగగ్రమ్మఁ • జిమ్మిరేఁగెఁ, జుక్కలును మింట నల్లనై • సురిఁగిపోవ.

చ॥ విపుల దిశాంతరంబుల వి • దీర్ణ మొనర్చుచు శింజినీ రుతం
బశనుల కైపడిన్ మెరసె • నంచులుచేరిన వింట్లనుండి క
ర్కశ విశిఖమ్ము లుగ్రగతిఁ • గ్రమ్మెడు నెవ్వడి వ్యోమభూమియున్
వశమఱఁగా పిడుగులు • వర్తిలఁజేసె భయంకర స్థితిన్.

చ॥ శరధియు పట్టి తున్గిపడు • సాయక బృందము నిండ వెండియున్
శరధియ యయ్యెఁ బ్రొద్దు శశి • చందముతోఁచెను రక్తముం జెదెన్
తరువులు బొగ్గులయ్యె జల • దంబులు మాఁడెను మండు కంపు ము
ద్భరముగఁ బిక్కటిల్లె నిరు • వాఁగుల సేనలు పాఱె భీతిమై.

ఉ॥ పీనుఁగులయ్యె నేనుఁగులు • ప్రేతములయ్యెఁ దురంగ జాతముల్
జానుతొఱంగి యంగములు • స్రగ్గి మడంగె శతాంగ జాలముల్
మానము తగ్గఁ దగ్గ నను • మానము వర్ధిల మానవాద సం
తానము వ్రాల్చె సాయక వి • తాన మరుల్ విసుమాన మొందఁగన్

సీ॥ కొన్ని వంగుచుఁబోయెఁ • గొన్నిపొంగుచుఁబోయెఁ, గొన్ని కూడుచుఁబోయెఁ • గొన్ని మాఁడెఁ
గొన్ని వ్రాలుచుఁబోయెఁ • గొన్ని వ్రేలుచుఁబోయెఁ, గొన్ని యొరిసిపోయెఁ • గొన్ని విరిసెఁ
గొన్ని కుడికినేగెఁ • గొన్ని యెడమ కేగె, సౌమిత్రి యేసిన • శరచయములు
కొన్ని యనిలుఁ బోలెఁ • గొన్ని యనలుఁ బోలెఁ, బిడుగులఁ బోలెను • జడిఁ బోలె
తే॥ కొన్ని ధారాధరంబును • కొని ధరాధ, రంబుఁ గొన్ని రుద్రాట్టహా • సంబుఁ గొన్ని
స్వేదజలమును బోలెఁ గ్ర • వ్యాద సుతుఁడు, వైచు తూపులు రణభూమిఁ • బరపువేళ.

ఉ॥ మాన్యత పీఁగు దాల్చినది • మాదవువిల్లా? గిరీశువిల్లా? సా
మాన్యుఁడు గాఁడు కర్త్తశము • మ్రాలదు వీనిని గెల్వశక్యమే
జన్యమునందు నాకని వి • శంకితుఁడై దనుజేంద్రసూతి చై
తన్యము దక్కి • విల్చుట యె • దం దలపోసి విభీషణుం డనున్.

చ॥ హరిహయు గెల్చి పొల్చిన ద • శాస్య కుమారుని గెల్చితీవు చి
త్తరువుగ నిల్చెవాఁడు మఱి • తల్లడమందె నిమేషమేని జా
పిర మొనరింప కియ్యదన • పెంపరలాడుము యంచుఁబల్కి హె
చ్చరిక యొనర్ప లక్ష్మణుఁడు • సమ్మతి జూపుచు నుండు నంతలో.

కాలునిలీలఁ గాం • తాశంబు గొనిరేఁగి, యసురపుత్త్రుం దని • లాస్త్రమేసె
లక్ష్మణాఖ్యుండు చె • లంగి నవ్వుచు వాయు, దేవతాక శరాన • దిగిచె దాని
ననలాస్త్రమును దైత్యుఁ • డరివోసి పరసంగ, దాని నాతండు న • డ్డాన నడఁచె
వారుణాస్త్రంబు బ • లారిజితుం దేయఁ, దచ్ఛరంబున దాని • త్రాణ నణఁచె
భాస్కరాస్త్రంబు రావణు • పట్టి విడువ, మిత్రశరముతో దాని సౌ • మిత్రి త్రుంచె
చచ్చితివ చచ్చితివ యని • మచ్చరించి, దనుజసుతుఁడు బ్రహ్మాస్త్రంబు • మొనసియేసె
భవుఁడు మఘవుఁడు నలువతా • వసులుసురలు, తలరిసౌమిత్రికి జి రాము • వాలయుఁగాత
మంచుఁ బలుక నాతఁడు విజ్బ • భించిమిడుఁగు, లడరఁగుప్పుచువచ్చున • య్యస్త్రముఁగని

ఉ॥ చేవ తొలంగి వీఁడు మును • చేసిన పోరునఁ గంజజాస్త్రమున్
ద్రోవఁ దొలంగియేయఁ గడ • ద్రోవఁగలేక యడంగె నంచు నీ
కైవడిఁ నిప్పుడుం దొడఁగెఁ • గావున నూరకయుంట పాడి గా
దీ వనజాస నాస్త్రమును • నే యుపసంహరణంబు చేసెదన్.

చ॥ జగము సుఖించుఁగాక యెల • సంబునఁ బోరొనరించు రావణిన్
దిగువకయుండుఁ గాకితని • దివ్య శరం బుపశాంతి నొందుఁగా
కగుత జయంబు ధర్మమున • కంచు నజాస్త్రము వీడె వేల్పులా
సుగుణ గణంబులం గుఱిచి • శూరుని లక్ష్మణు సన్నుతించుచున్.

చ॥ జగము సుఖించుఁగాక యని • చాటి వచించె దురాత్మ రావణిన్
దెగ వచియింపఁడయ్యె రణ • ధీరుఁ డితండు విరించనాస్త్రమున్
దగ నుపసంహరింపు మనెఁ • దక్కెఁ ఔ బుద్ధిని చూపఁడయ్యె నీ
సుగుణ గణంబు లెయ్యెడలఁ • జూనమ యంచు నుతించుచుండఁగన్.

చ॥ అనలముతోర డీకొనఁగ • హ్లాదిని వచ్చినభంగి వచ్చి ల
క్ష్మణుని శరంబు దైత్య విశి • ఖంబు నడంచి నభంబు సర్వమున్
బొనుపడ నొక్క జ్వాలగ స • ముద్ధతి నేచిన వేలుపూపుచే
నణఁచె నిషాత్తవేదన వి • షాంతరయుక్తి నడంచు కైవడిన్.

ఉ॥ లక్ష్మణు శౌర్య సాహస బ • లంబులఁ గాంచి విరించు లప్డు దీ
లక్ష్మి యెలర్చు రామపుల • లావు దలంప నశక్యముల్ భువిన్
లక్ష్మము పాటియేని గల • వా? యన శంభుఁడు పల్కె మీరలున్
సూక్ష్మమతిన్ గణింప కిటు • స్థూలమతిం దలపోయఁ జెల్లునే?

మ॥ నర నారాయణు లీ నరాకృతులు వి • జ్ఞానేశ్వరుల్ దుష్ట సం
హరణార్థం బవతారమందిరి జగ • ద్వ్యాపారు లాద్యుల్ జగ
ద్భరణ ప్రౌఢపు లవ్యయాత్ములు జగ • త్కల్యాణ సంధాయకుల్
కరుణాపూర్ణులు వీరలం గలఁచునే • కంజాసనాద్యస్త్రముల్?

శా॥ సామాన్యాకృతులొందియుం బ్రకృతి సం • సర్గంబు లేకుండి మా
యామేయావరణాంతరస్థులయి పూ • ర్వాకారముల్ తోఁప సీ
కీమాడ్కిం జరియించు వారఖిల భూ • శీలాను లీయర్థమున్
మీమీ చిత్తములంద యుంచుకొనుఁడీ • మీరయ్యెడున్ భద్రము.

ఉ॥ చేమిరి పాలలోఁ గలియు • చెల్వున జీవులయందు భక్త హ
త్తామరసంబులే యవస • థంబుగఁ గొన్న మృణాలభోజి గ
త్యామల పూర్ణతత్త్వము ధ • రాత్మజభర్త నిజమ్ము ధర్మమున్
భూమిని కాచపొంచె నిటు • పుట్టె మహాత్ముల వేఁడికోలున.

చ॥ అని శశిమౌళి పల్కఁగ వి • యచ్చరు లచ్చెరువంది శంకరా
విని కని యుంటి మయ్యు నని • వేకమునం దన మాయచే బలుం
గని వహి నందియంబుగొని • కానటలీసట నొందుచుండు పా
త్మను గల శంకలెల్లఁ గడు • డప్పగఁ బోయిన వంచు నుండఁగన్.

శా॥ మాయాశీలుఁడు రావణాత్మజుఁడు దు • ర్మానంబు పాటించి సి
యారాముష్కాలము నేఁటితో మగిడె నా • య్యం బ్రోద మైనచో
నాయీ యేటును కాచికొమ్ము యనుచున్ • నారాయణాస్త్రంబు బం
త్రాయస్తంబుగఁజేసి యేసె జగ మా • హాకారముల్ సేయఁగన్.

చ॥ శరములమీఁదఁ గేల్మొగిచి • సిద్ధ మునీంద్ర సురాసు లెల్లఁడున్
హరి హరి యంచుఁ గావికొన • నారవముం బొనరించి పక్షహ
శరము కరమ్ములన్ మొగుచు • జంతు కదంబము పంటపెన్పు శ్రీ
దరసిన లక్ష్మణుం డెమర • నచ్యుతుఁ దేనని నిల్చె నెంతయున్.

మ॥ జ్వలన జ్వాలల వెల్వరించుచు జగ • జ్జాలంబులం గాల్చ మం
దల నేతెంచు మహాస్త్రముం దొలఁగి పోఁ • దప్పించుకో నెంచ కం
చల నున్నట్టి సుమిత్ర పుత్త్రుఁగని వై • ష్ణవ్యాంబకం బంటకే
తలఁగంబాటి ప్రదక్షిణంబు గొని యం • తర్ధాన మందెం త్వరన్.

చ॥ వనచరు లుల్లసిల్లిరి త • పస్వులు లోకము గాచితంచు మో
దనమున గంతులేసిరి ము • దంబున వేల్పులు దేవ సుందరుల్
మనమున నుబ్బి గొబ్బున సు • మంబులు చల్లిరి బ్రహ్మయున్ భవుం
డును వినుతించి రాడిరి క • డుంగడు సంతసమంది రెల్లరున్

మ॥ బలహీనంబయి వైష్ణవాస్త్ర మడఁగెన్ • భావింప వీఁడెవ్వఁడో ?
జలజాక్షుండొకొ ? యెవ్వఁడేని యగుతన్ • శంకింపనేలా ? జగ
ద్విలయంబుం గలిగించు పాశుపతమున్ • వేకూర్చి యీబాలిశున్
జలమారన్ వధియించువాఁడ నని యెం • చం జిత్తమం దుద్ధతిన్

ఉ॥ రావణి నిశ్చయంబును స • రాలున దివ్యులెఱింగి యేడిరా
త్రోవ ? జగంబు జీవ నికు • రుంబముతో నశియించునేమొ నేఁ
డీవహి వీనిచేత ? నెదు • రెయ్యది ? దీనిసహించు వారలీ
దేవతలందు గల్గరని • దీనత నొంది కలంగుచుండఁగన్

చ॥ ఇతరు లెఱుంగకుండినది • యీడును లేనిది మున్నువానికిన్
జితమదనుండు సత్తపము • సేయఁగ మెచ్చి యొసంగు నయ్యమో
ఘ తర మహాస్త్రమున్ మది న • ఖండితభక్తి భజించి లక్ష్మణున్
మృతునిగఁ జేసి క్రమ్మఱుమ • మేవడి నంచు వచించి యేయుడున్.

సీ॥ అయ్యస్త్ర మంత గ • దాసి తోమర కుంత, పరశు ముద్గర శూల • వాల నాగ
గరళ భూత ప్రేత • కాల నిర్ఘాతాది, బహుళ రూపంబులఁ • బరఁగి పిలయ
కాలాగ్ని సప్తసా • గరములు చండ మా, రుతమును తోడరా • క్షితి మునుంగ
తఱిఁ గప్పు చీఁకట్లు • నెఱసిన వననొప్పి, సౌమిత్రి యురము ల • క్ష్యంబుగాఁగఁ
తే॥ గెరలిలోకత్రయము గిర • గిరనఁదిరుగ, కరణిఁ దోఁపంగ నుడియుచుఁ • గదఁగిరాఁగ
వానరులు వేలుపులు మని • వరులు జడిసి, మొగిసి కనలేక కన్నులు • మూసికొనిరి.

సీ॥ గడగడ వడఁకుచు • నొడలు చెమర్పంగఁ, గని విభీషణుఁడు ల • క్ష్మణ ! యిదేమి ?
దీనిఁ దొలంగించు • తెరువెయ్యదియు లేదె ? యన నుత్తరముగ హా • సంబొనర్చె
వానర వీరులు • పాదసన్నిధి డాసి, యభయ మభయ మంచు • నఱచునంత
నలుకకుఁ డలుకకుఁ • డని చేయి వీచుచు, జగము లల్లలనాడు • చందముగని
తే॥ పాశుపతమును ధ్యానించి • భావమందు, దీని నడఁపుము వేఱొండు • తెగువ వలవ
దనుచు నొకశర మరివోసి • మొనసి విడిచె, త్రుటిని తన్మహాస్త్రమ బలో • ద్యోగమడఁచె.

మ॥ దివిఁ గోలాహలముల్ చెలంగె మొరసెన్ • దివ్యానక స్తోమముల్
భువి శాఖామృగముల్ మదించె వెస నం • భోరాశు లుప్పొంగె సా
ర్జవ ఘోషంబుల వించె మేఘములు ద • ర్పం బుబ్బ మోదించి రా
ఘవుఁ గాంచెన్ జయలక్ష్మి శిక్షిత కటా • క్ష శ్రీల హేలాగతిన్.

మ॥ లయకాలంబున సర్వలోకములు వై • కల్యంబుగా జీవ సం
దయము న్నాశము సేయు రుద్రుని మహా • స్త్ర క్రూర వేగంబు నీ
రయమై వ్యర్థముగా నొనర్చిన సుమి • త్రాపుత్త్రిక స్థైర్యమున్
దయివారం గని దిగ్భ్రమించి నిలిచెన్ • దైత్యేంద్ర సూనుండటన్.

శా॥ దివ్యాస్త్రం బిదివోయె నంచు మది సం • దేహంబు గ్రైకోశ యా
త్రవ్యాముందు ప్రయోగ చాతురిమ ము • గ్రంబై ప్రకాశింపఁగా
నే వ్యాపన్నత నొందనేల యని కై • నేర్పొప్ప సౌమిత్త్రిపై
నవ్య స్థేమము మీఱనేసె నిభజి • న్నాదంబు గావించుచున్.

శా॥ సుగ్రీవాదులు వేసరిల్లక మహా • క్షోణీధ్రముల్ దెచ్చి సం
వ్యగ్ర ప్రక్రియ నున్న రావణిపయిన్ • వైవన్ విజృంభించి పం
క్తిగ్రీవాత్మజుఁ డంపలం గురిసి త • ద్వేగంబు వారించి య
త్యుగ్రుండై కని తత్పితృవ్యుఁ బలుకున్ • సోత్ప్రాస వాక్యంబులన్.

## మేఘనాదుఁడు విభీషణు నిందించుట

శా॥ జాతి భ్రష్టునిమాడ్కి నన్వయ యశ • స్సౌశీల్యముల్ జార్చి దు
ర్న్యాతి ప్రీతిని మర్త్యమాత్రుల తదం • ఘ్రుల్ వట్టి సేవించుచున్
ఖ్యాతిం బోవిచి వారి పాటలకు వె • న్కం దాళముల్ వైచుచున్
నీతిన్ మాలి చరించు నీదుశిరమున్ • నేలం బడం గూల్చెదన్.

శా॥ వీక్షామాత్రన కంపమొంది క్రతుభు • గ్బృందంబు సేవించినన్
నిక్షేపంబులు కూడినన్ భువన ని • ర్ణేతృత్వ మే యబ్బినన్
శిక్షమాన పరాక్రమ స్థిరగుణుల్ • సీత్కారముల్సేయు నీ
కుక్షిక్షప్రవ నీచ జీవితము నో • క్రూరాత్మ! వాంఛింతురే ?

మ॥ జలముల్ గల్గినచోటనే గలుగు మ • త్స్యశ్రేణి దైత్యేశ్వరుం
డెలమిన్ భాసిలుచోటనే దనుజులున్ • దృష్టింపఁగా నుంద్రు వా
రలు చేటొందిన వేళలన్ బ్రబునకై • ప్రాణంబు లర్పింత్రు నీ
వలెఁ గాఁజాలరు; లంక నే యసురులం • బాలింతువో మీఁదటన్ ?

ఉ॥ పూర్వము వేల్పుపెద్దఁ దన • బొడ్డునఁ గాంచిన మాయి కేశవున్
గర్వము సర్వముంజెడ వ • గర్చుచుఁ బాఱఁగఁదోలి యొక్కచే
శర్వుని పర్వతంబు గొనఁ • జాలిన మత్పిత రాజ్యభారమున్
నిర్వహణంబు సేయుటలు • నీవిటు కోరుటకా ? కులాధమా ?

మ॥ అరవిందాసన వంశమందు జననం • బందంబుగా నందుటన్
సురలు న్నిన్ను భజింత్రు పుణ్యజన దూ • ష్యుండైన నీవిప్పుడో

నరులం గొల్చుచు నన్న సంపదల భ్రమిం • గం జూచుచున్నావు నీ
కరయన్ మానమనంగ నున్నదియె? మా • యంబౌను మాతోడనే.

శా॥ నిందం గూరిచి విందచేసి కులమున్? నీ చెల్లెలింబట్టి యా
క్రందింపం దయమాలి ముక్కు సెవులన్ • ఖండించు దుష్టాత్ములన్
సందేహింపక తెచ్చినాఁడ విను జ్యే • ష్ఠభ్రాతఁ జంపించి లం
కం దైవాఱఁగ నేలుకొందువు గదా? కష్టాత్మ! వంశాదనా!

చ॥ గురుహిత బంధుమిత్రులను • కూలిచి కైకొను మేల్మికంటెఁ బే
దఱికమె మేలుకాదె? రణ • ధారుణిఁ గూలిన యన్నతోడనే
పొరలుచు నేడ్తువో? ముదము • బొంది బళీ! యని కేకవెట్టెదో?
నరు గెలుపు న్నుతించెదవొ? • నారక మందెదొ? వంశదూషణా?

మ॥ పరుగుల్ వాఱిన కాలకింకరుల గె • ల్వంజేయువారా నరుల్?
తెరలన్ మందులచేత జీవములు సం • ధిల్లంగ నిల్పెందు వా
రరయన్ గెల్తురె? యన్న సంపదల నీ • వందంగ నర్హుండవే?
శిరముం ద్రుంపక వీడితిన్ జగము నన్ • నెగ్గించునన్ శంకమై.

శా॥ భ్రాతృద్రోహివి నీ మొగంబు గనినం • బాపంబు సిద్ధించు నీ
నేతృత్వంబు సహించునే జగము? నీ నీ • తంబు లాలించునే?
రోతల్ చేఁత లటంచు దూఱు ప్రభుపు • త్త్రుం గాంచి చిర్నవ్వునన్
నీతి ప్రౌఢి విభీషణుండు పలికెన్ • నిర్భీత చిత్తస్థితిన్.

ఉ॥ ధర్మమె తోడగున్ మహిని • ధర్మము తోడుగఁ గొంచుఁ బెక్కు దు
ష్కర్మము లాచరించి నర • కంబునఁ గూలఁగ జాలకుంటి స
త్కర్మముఁ జిక్కఁబట్టితిని కల్లయు వీడితిఁ బంక్తిమస్తకుం
డర్మిలి నిందితంబులకు • నాస వహించిన దాఁకఁ దమ్ముఁడన్.

మ॥ కలుద్రాపిన్ బరదారగోర గిలుబున్ • గ్రవ్యంబు నాశింప మూ
ర్ఖులఁ జేసిన్ బెరసొత్తులం బలిమిఁ గై • కోఁబోవ సత్కర్ములన్
గలహింపన్ బరనిందనంబు తలఁపన్ • గావింప నింద్యమ్ములన్
ఖలులన్ దుర్వ్యభిచారులన్ విడుచుటల్ • కారాని కార్యంబొకో?

మ॥ త్రిజగంబుల్ వినుతించు తత్త్వమగు నా • దేవేశు సర్వాంగి పూ
త జగన్మాత పతివ్రతా తిలకమున్ • ధర్షించి బాధించుటల్
త్యజియింపం దగునంటి దీననగు నా • తప్పేమి? నీ తండ్రి య
ల్క జనింప న్ననుఁ వెళ్ళఁగొట్ట నటని • ల్వంబోలునే తెల్పుమా?

ఉ॥ క్రొవ్వున ధర్మముం గనక • కోపము కామము వేల్పుగా మదిన్
నివ్వటిలం దలంచు మిము • నిత్య సుఖంబులె యొందనిమ్ము మ

మ్మెవ్విధినేని నింద యెల • యింపఁగ రౌరవ మందవిమ్మిఁకన్
ద్రివ్వలు సాగు దుష్కృతము • త్రెవ్వక యుండునె ? ధర్మమోడునే ?

ఉ॥ జ్ఞానులకున్ సుగమ్యుఁడగు • సత్యవిహారుని రాముఁ జేరితిన్
మానుగ సర్వలోకములు • మన్నన సేసెదుఁ గాక నిందయే
హాని యొనర్చుఁ గాక భువిఁ • బొందుఁదు మీరలు మేలునేని కీ
దేనియు నంచు మాలమిడి • యిట్టులు నార్చుచుఁ బల్కి పిమ్మటన్.

ఉ॥ రావణి పల్కె సీతలఁచు • రాజ్యము వేలుములెల్ల నిల్చునే ?
నా పల కేలనున్న యొక • నారసమంటినఁ దీఱుఁగాక నేఁ
డావలి కెట్టులేగె దని • యల్కను తార్క్ష్యుని పోలు బాణమున్
జాపుమ యంచు వీడెఁ దన • చాపముఁ జక్రముఁ బోల [illegible].

తే॥ కీలయనఁ బిదుగన భువు • కూలమనఁగ, వచ్చుటను కాంచి మిత్రుండు • వచ్చెఁ జచ్చె
ననుచుఁ బ్లవగు లాక్రోశింప • నమరులెన్న, మించి సౌమిత్రి నడుమనే • త్రుంచె దాని

క॥ తన విశిఖము తునియఁగ రా, వణి వెండియు భల్ల మొంకు • వకినేయ విభీ
షణుఁ డాఁకనీక నడుమనె, తునుకలుగా లక్ష్మణుండు • తుండించె వెసన్.

శా॥ తన్నుం జంపఁగ నుద్యమించె నను కాం • తాశంబునన్ సత్య సం
పన్నుండైన విభీషణుండు ఘన భా • స్వద్దండముం బూని యా
పన్నుండైన బలారి జిద్రథము న • శ్వశ్రేణితో సారథిన్
ఛిన్నాభిన్నము చేసి యార్చెఁ బ్లవగ • శ్రేష్ఠుల్ ప్రమోదింపఁగన్.

చ॥ చెడిన రథంబుపై నిలిచి • చిందఱగొన్న దశాస్యసూతి నె
వ్వడిని సుమిత్రపట్టి పయి • వానరపాళిపయిం బితృవ్యుపై
జడిగొను పోల్కె శాత శర • సంఘములేసి రణస్థలంబు నె
య్యెడఁగన రక్తసిక్తముగ • నేత్రెఱఁజేసి మదించి యార్చుచున్.

చ॥ మురియని వేరులేక వెస • మృమ్మరిమైన దుఃఖంబు సేయఁగా
నరిది యటంచు మానసము • నందు దలంచి క్షణంబులోన నం
బరతల వీథికేగె నను • వార్త కపీశ్వర వర్గమందు తీ
వరపడి పర్వఁ బంక్తిముఖు • ధర్మగృహంబున కేగె నత్తఱిన్.

## 27. ఇంద్రజి ద్వధ పటలము (71)

మ॥ గగనంబందు మొయిళ్ళ డాఁగె నను శం • కంబొంది మున్నోలెఁ బె
ల్లగ మాయల్ పచరించు నంచుఁ బ్లవగుల్ • మోమోడి కన్పండ నా
శుగ వేగంబున మేను రక్తమయమై • స్రుక్కింపఁగా వచ్చు మె
చ్చుగు పుత్త్రుంగని రావణుండు చలిత • వ్యాపారుఁడై యిట్లనున్.

ఉ॥ చూచిన నీముఖంబు పరి • పూర్తి వహించి యెసంగదంచు నీ
మేని వ్రణంబులే తెలిపె • మిక్కిలి క్లాంతిని బొంది కంపమున్
బూని ఖగేంద్రుఁ గన్న యహి • పోలిక నుంటివి కారణంబు నా
వీనుల మానసంబు విన • వేగిరపాటు వహించెఁ దెల్పవే.

చ॥ అనవుడు నిట్లనున్ దశము • ఖాత్మజుఁ డూనిన మాయలెల్ల నీ
యనుజుఁడు దెల్ప వారలొగి • యజ్ఞము విఘ్నము సేసి రంత నేఁ
గనలి పరాక్రమంబు నొడి • కంబును తెంపును చూపి పోరితిన్
వనజజ విష్ణు రుద్ర శర • వారము లక్ష్మణుఁ డోర్చె నేమనన్!

చ॥ అతులిత వైష్ణవాస్త్ర మొగి • నా రఘువర్యుఁ బ్రదక్షిణించి కుం
చితగతి నేగెనన్న విర • చింపఁగ వెండి మహాస్త్ర మొక్క దం
చితముగ నున్నదేమి? కడు • చేటు మనంబునఁ గోరి కోరి యా
వితమునఁ దెచ్చికొంటి విది • వీడునె యెన్నివిధాలఁ జూచినన్?

చ॥ కడఁగి విరించినాస్త్రము జ • గమ్ము నశించున యన్న భీతిచేఁ
దొడఁగఁడు దాన నే గెలువ • తోఁ జనుదెంచితి మున్ను నేఁడు నా
కడఁకలు సాగవయ్యెఁ జులు • కన్ స్వబలంబున నన్ను గూల్పఁగాఁ
దొడఁగె జగంబు లొక్కరుఁడె • దోరుప శక్తుఁడు లక్ష్మణుండనా?

చ॥ జంకితినంచు నెంచకుము • జానకిపైఁ గల యాస వీడినన్
గింకను వీడి శాంతి నవ • గీర్ణ చరిత్రులు రాఘవప్రభుల్
లంకను వీడువారు మన • లన్ క్షమియించెడు వారు నీ సుహృ
త్కింకర పుత్త్రిబంధు బల • కీర్తులు మాయక నిల్చు నావుడున్.

చ॥ భుజములు సంచలింప క్రిద • ముల్ నవచంద్రికలన్ వెలార్ప బే
రజముగ నవ్వి రావణుఁడు • రాజస మొప్పఁగ నింక నీవు భూ
భుజుల పయిన్ దురంబునకుఁ • బోవవు భీతియుఁ జింతయేల? య
క్కజముగ నేన యేగి యస • కంబున వారలఁ జంపి వచ్చెదన్.

ఉ॥ ఉండిసవారు గెల్తురని • యుండెడువారు జయింతురంచు నీ
దండితనంబు నాకు నుచి • తంబుగఁ దోఁచెడు నెంచు నమ్మ యా
కొండిక యొంటరిమ్మ మది • గోరి పొసంగ వహింప లేదు మ
చ్చండ భుజాబలంబు నెల • సంబున నమ్మియె కొంటి నీకగన్.

ఉ॥ పేదతనంబు తెల్పితివి • పేరిమి వింశతి చండబాహుల సం
పాదిత కీర్తి గేయములు • పాడ కొనన్ జగమందు నిర్జరుల్
మోదిలి చూచుచుండ నని • బుద్బుద దేహము పాతుఁగాక యా
పైదలి వీడువాఁడ నను • వార్తయుఁ బుట్టునె నోట? బాలకా!

చ॥ ఇలను జయంబు నేను గడి • యింపక పోయిన రామ నామమున్
నిలుపునయేని నాయభిధ • నిల్వక పోపునె ? యీల్గు టెన్నఁడేఁ
గలదియ రాదె ? యెల్లరను • కాలము మ్రింగుచు నున్న దే కదా ?
కలదు లయంబు జీవులకుఁ • గల్గదు కీర్తికి నాశ మెన్నఁడున్.

చ॥ విడిచితి సీతనన్న నుడి • వీనులఁ బడ్డ క్షణంబులోపలం
బొడవునఁ గిట్టి కట్టి కొని • పోదురుగాక నిలింపు లింతకున్
జడియుదురే ? జగంబులఁ ద్రి • శస్త్ర బలంబున గెల్చి కీరితిం
బడసిన యేను నప్పిఱికి • పందల పొందెడు చావు చత్తునే ?

ఉ॥ పెక్కు లిఁకేల ? నీవరిగి • వేశ్మముచేరి శరీర మెల్లెడం
దక్కక గ్రుచ్చుకొన్న విశి • త ప్రదరంబులఁ బుచ్చివైచి నీ
త్రొక్కటపాటు దీర్చికొని • దుఃఖము వోవఁగ నిద్రసేయు మే
నొక్కఁడ నేగువాఁడ నని • యుగ్రత లేమకుఁ దేప సెప్పెనన్.

చ॥ జనకుని పాదపద్మములఁ • జాఁగిలి చేతులు మోడ్చి నాపయిం
గనలకుమీ క్షమింపుమి జ • గజ్జన విశ్రుత గేయ ! యిప్పుడే
చనియెద సంగరంబునకు • శాంతిలు మే మరణింపు పెక్కునై
నను కలయింపు నాదు • వచనంబుల నీకు నెఱుంగ నయ్యెడున్

చ॥ అని రథమెక్కి పద్మజ శ • రాదు లొసంగిన యాయుధంబులం
గొని తగ నక్షకోటులకుఁ • గోరికలెల్ల నొసంగి బాష్పవాః
కణములు నిండినట్టి కడ • కన్నులఁ దండ్రిని చూచి చూచి నె
మ్మనము దృఢంబు చేసికొని • మార్తుర మీఁదికిఁ బోవ వెల్వడెన్.

ఉ॥ లంకను గల్గు దైత్యులు క • లంగుచు నిన్నెడఁ బాయలేము మ
మ్మంకిలి సేయఁబోకు మిదె • యందనె వత్తుము చత్తుమంచు న
ల్వంకలఁ జుట్టిరా జనకు • వారిక కిన్నిడి కొపుఁ దీరు నా
యంకులతోడ శాత్రవుల • నంతకు ప్రోలికి నంపి వచ్చెదన్.

మ॥ అని యారార్పఁగ దైత్యకామినులు చిం • తాక్రాంతలై కాంచి నా
యన! నీముద్దు మొగంబు చూడకెటులీ • ప్రాణాలతో నుందుమో
చనుదెంచెం గదె కాళరాత్రియయి యా • క్ష్మాపుత్రి యీలంకకున్
జనువారల్ చనువారలే గద ! వినా • శం బిట్లు రాఁగూడునే ?

చ॥ అని విలపింప వారల క • టాక్ష పరంపర దాఁటిపోయె; మా
యను గొని దాఁగి యింద్రజితుఁ • డావలికేగెనొ ? మోసచేయఁడే
మనెదు విభీషణా ! యనుచు • నాడుచు లక్ష్మణుఁడుండ వాని స్యం
దన విరవం బకాండ జల • ద ధ్వనినాఁ గవిసెన్ శ్రవంబులన్.

సీ॥ పసిఁడి కంబములతో • వఱలు పెక్కేంబులు. పిడుగులఁ బోలిన • బిట్టు రవము
వరరత్న ఖచితమై • మెఱపుల కీల్గొయి. ముల్లోకముల కేగ • మొనయునదియు
జలధులు గలఁగంగ • జగములు వడఁకంగ, దిగ్గజంబులు తెల్వి • ద్రగ్గి ద్రగ్గఁ
బ్లవగబలము గుండె • లవియఁ గులాద్రులూఁ, టాడ ధూళియు రేగ • నవని వీఁగ
తే॥ శేష శిరములు చలియింపఁ • జేరెరథము, రాక్షసులగర్జనంబు ఘో • రముగఁ జెలఁగె
నింద్రజితుఁడు క్రూరాస్త్రంబు • లేసి యార్చె, లక్ష్మణుండు ప్రత్యస్త్రంబు • లంగవించె.

ఉ॥ మాయలు దుస్తరంబు లతి • మానుషముల్ గల వీని నిప్పుడే
మాయఁగఁ జేయవేని జయ • మార్గము నవ్వలఁ గాంచలేవు సు
మ్మీ యను నవ్విభీషణుని • మేలి వచస్సుల నాదరించి దై
తేయునిమీఁద లక్ష్మణుఁడు • తేపలుగాఁ గురియించె బాణముల్.

చ॥ ఇరువురు నెచ్చుకుందు కన • నేర్పడకుండగ దూపులేయఁగా
శరమయమయ్యె బెట్టిదపు • శబ్దముతో రణరంగమెల్ల వా
నరులును దానవుల్ చెదరి • నక్కిరి పల్లములందు మబ్బులం
ట్లిరువురు మీఱి మీఱి కురి • యించిరి దొడ్డగ బాణవర్షమున్.

చ॥ నడుమనె దానవాస్త్రములు • నాశము నెందఁగ రాఘవాస్త్రముల్
తొడరి యతిక్రమించి కొని • తూఱుచు రావణి మేనిరక్తముం
గుడిచెను దానవాస్త్రములు • కొన్ని మరుత్సుతు మేనఁ బుట్టలో
నిడుపని పోల్కిఁ దూఱ గమ • నింప కుపేక్ష యొనర్చె నాతఁడున్.

మ॥ విషముం బోలిన తూపులం బఱపి పృ • థ్వీనాథపుత్త్రుండు రా
క్షసనాథాత్మజు కొందడంబు సురలెం • చం ద్రుంచె దైతేయు నా
రసముల్ లక్ష్యము దప్పుచున్ గుఱికిఁ జే • రంబోక ద్రుంగాఱుచున్
బసమాలెం గ్రథనక్రియల్ చలుపు ద్రో • వన్ సత్త్వహీనంబులై.

మ॥ విలువిద్దెం దన నేర్పుం బలము గా • న్పింపంగ వీఱుండమిన్
బలభిద్ద్వేషి పులస్త్యమౌని తనకున్ • వాత్సల్య సంపూర్ణుఁడై
కలనం దోడని యిచ్చు కుంతమును. వీ • కన్ వైవ మౌనీంద్ర వా
గ్బల సంకాశ శిలీముఖంబున నడం • గం ద్రుంచె సౌమిత్రియున్.

ఆ॥ మేకు లూన్చినట్లు • మేన లక్ష్మణ శరా, వళులు పొడువ నింద్ర • వైరి పురల
నలుఁగు లేయుచుండ • నాతని తూణంబు, తునిఁగిపడఁగ రాము • ననుజుఁ డేసె
ఆ॥ తేరు గలుగ వీఁడు • తెరలఁడు లొంగఁడు, నను చు హయుల నేసి • యడఁగకునికిఁ
బగ్గములను తెగవి • పరికించి సారథి, శిరము ద్రుంచి వైచెఁ • జిత్రగతుల.
ఆ॥ ఇంద్రియములు కలఁచి • యేఁపఁ దపించు త, పస్వి మనముపోలెఁ • బడుపుఁ జెలి ప
తిప్రతాత్వ సరణిఁ • దీండ్రించి స్వేచ్ఛను, పూనెఁ జోదకుండు • లేని తేరు.

తే॥ పరుగువాఱుహయముల బట్టి • పంపి తానె, తనయురం దెతూణముగ గ్రుచ్చినశరముల
వారివారి లక్ష్మణునకు • మారుతిపయి, బెరలపై నేసి చేసెను • వీర రవము.

శా॥ వీరాగ్రేసరు డీత డీతని మహా • వీరత్వ మెందేనియుం
బేరుం గాంచిన శూరవార విలస • ద్వీరత్వ మాత్రంబొకో ?
వీరం డ్మృత్యువు దాసినన్ గదకయుం • క్రోద్ధత్వమున్ పీడ రె
వ్వారో వారలె శూరులంచు విరులన్ • వర్షించి రాఖేచరుల్.

శా॥ నాయమ్ముల్ తనమేన దీసి పఱపెన్ • నామీదనే చెల్లరే !
యాయమ్ముల్ మనమున్ గలంగువడి నా • యమ్ముల్ ప్రసారించినన్
గాయమ్ముల్ గణియింపడున్ సురుగడు • కంపింపడున్ సోలడున్
మాయమ్మా గద వీనితో గడిమి సా • మర్థ్యమ్ము లిబ్భూమిపై.

మ॥ అని సౌమిత్రియు మెచ్చి యాడ గని వీ • డాకాశము జేరునో
ఘనమాయల్ పచరించునో పగటనే • ఖండింపు మీదైత్యు దం
డన నల్లంచు విభీషణుండు పలుకన్ • దర్పంబు క్రుంగారు నీ
దినుజుం డెక్కడి కేగువాడని సుమి • త్రాసూతి మందస్మితిన్.

చ॥ ఎచ్చటికేగినన్ విడక • యేగి మదీయ శిలీముఖంబు లీ
ప్రుచ్చును గ్రుచ్చి చంపు ? బల • మున్ జఱమున్ దిగజాఱె వీడికన్
జచ్చెడువాడ కాక మఱి • చావక తప్పి చనంగ నేర్చునే ·
చిచ్చుల పిడ్గులట్టి కడు • చేవ చెఱంగు నలుంగు లుండగన్.

తే॥ అనెడు సంతట రక్తకా • యంబుతోడ, రముఖను వేయి కరములు • పరవుచుండ
గనకరథముపై నభమున • జనగలేచు, నింద్రజితుమాడ్కి రావణు • యుంచె మింట.

తే॥ తెల్లవాఱె ఘంటను వెస • నిసకరుండు, రక్కసులుబోలు చీకటుల్ • స్రుక్కి సమసె
వంచనములెల్ల బొలియ రా • పణియు గూలె, నసుమ నఱచిరి వేలుపు • లంబరమున.

తే॥ కీర్తికర భుజబలశూర ! కృత్తివాసు, దొసగు కేరుండ గేరు వి • భ్లసగు చుండ
వీడు చావడయ్యె యని వి • భీషణుండు, లక్ష్మణుని హెచ్చరించె నా • లంబునందు.

మ॥ శర సంధాన చతుర్ముఖుండయిన యా • సౌమిత్రి యా పచ్చనా
ఖపవుల్ చావవు పల్లెమట్లుగల చ • క్రంబుల్ తునాతునుకలై
మురియుంబోవని నిశ్చయించి చటులన్ • మూలంబు గుర్తించుచున్
విరియంగా గడచీలలన్ విఱిచె వె • వ్వేత్తై పడం జక్రముల్.

తే॥ చీలబూడ జక్రంబులు • చెదరి వేఱు, పడగ నరదంబు పడె వారు • వములు తరువు
గొడ్డటం బడగొట్టబ • డిలు కలంగు, ధరణి సత్త్వహీనంబులై • ధరణి వ్రాలె.

క॥ రథ మవియగ నందలి యా, యుధములు నొండొండ పైపై • యుడివోవ వియ
త్పథి కిరిసె యసుర జగములు, నిధన భయం బంది కలగు • నెఱి గరించెన్.

క॥ మేఘనిభ దేహుఁడగు నా, మేఘరవుఁడు పొంచి దొడ్డ • మేఘములందే
మేఘముకైవడి శిలల న, మోఘముగా గురిసె వరము • పోఁడిమివలనన్.

తే॥ దిక్కు వోఁపక వానరుల్ • ద్రుక్కి శిరము. లురము లగలంగ ధారణి • నురలఁ గాంచి
లక్ష్మణుఁడు త్రివిక్రము మేని • లలి నభంబు, విశిఖ కాయమానంబు గా • వించివైచె.

తే॥ వైశ్రవణి యెదిరించు స • త్త్వము కృశించె, నల్లనైన యాకాశంబు • నడుమ నొక్క
యెత్తు మొగులునా నుండిన • యింద్రజితుని, మేనిజాడ లక్షించె సౌ • మిత్రి యపుడు.

క॥ ధనువు తునుంగకుండిన నా, ధనువుగొను కరంబు తునిఁగి • ధరణిం బడదే
యని తలఁచి త్రెవ్వనేసెను, ఘనకరమున్ గంకణాది • కముతో నురలన్

ఆ॥ విలయ మారుతంబు • వీవ మేఘంబింద్ర, ధనువుతోడఁ బడిన • యనువు వోఁప
వానిచేయి వడియె • నూనిన ధనువుతో, మణి విభూషణములు • మలసి వెలుఁగ.

తే॥ బాలచంద్రు శేషుఁడు పట్టు • పగిది నొప్ప, వ్రేళ్ళతోఁ జుట్టి పట్టిన • వింటితోడఁ
దరుల శిలలు కపులు నల్గ • దనుజుకరము, ధాత్రిఁ బడి తకపికలాడి • తల్లడిల్లె.

తే॥ సూర్యుఁ డురలక చంద్రుఁడు • స్రుక్కకుండఁ, మేరుగిరి దొరలక శక్ర • వైరి కరము
పడుటగవి యంత్రముంబోలు • బ్రతుకునందు, మోహమేలని విబుధ స • మూహమనియె.

ఉ॥ అంచిత పుణ్యు లక్ష్మణుని • యస్త్రముచేత నసత్య మల్పమౌ
నంచుఁ దలంచు రావణుని • యగ్రసుతుండు కలంకచిత్తుఁడున్
పంచకుఁడైన యింద్రజితు • బాహువు త్రెవ్వి ధరిత్రిఁగూల రా
త్రించరులెల్లఁ గాంచి తల • త్రెవ్విన తీరునఁ గుందిరయ్యెడన్.

ఉ॥ వానరనాయకుల్ చెలఁగి • వారక సింహరవంబు సేయుచున్
దానవసేనలం దటిమి • దంత నఖావలిచేఁ బదాహతిన్
బీనుఁగు పెంటచేసి యల • వేల్పుల లోకము క్రొత్త సంపృతుల్
జానుగ నిండి మెండుకొను • చక్కటి తక్కక చేసి రత్తఱిన్.

ఉ॥ సీలగళుఁడు మున్ను కరు • ణించి యొసంగిన గొప్ప శూలమున్
గేల ధరించి శత్రు సవ • గీర్ణచరిత్ర మెఱుంగలేని నిన్
నేలకుఁ ద్రోచికాక మఱి • సీలుగనంచు మహానటుండనన్
గాలియనంగఁ జిమ్మఁగఁ • గ్రాలి దశాస్యకుమారుఁ డేఁచఁగన్.

మ॥ పరమార్థం బగునేని రాఘవుఁడు స • త్త్వం బూఁదియున్నేని యు
ర్వర ధర్మంబు జయించునేని బలభి • త్ప్రత్యర్థి శీర్షం బిలన్
దొరలుంగాకని లక్ష్మణుండు విలస • ద్దోస్సార మేపారఁగా
శర మాకర్ణము లాగి వీచె జగముల్ • సంతోషముం బొందఁగన్.

తే॥ చక్రశూలబ్రహ్మాస్త్ర వ • జ్రములు సిగ్గు, నొందనమ్మహాశర మగ్ని • లుమియుచుఁ జని
యింద్రజితుని శిరము ద్రుంచి • యిలను గూల్చి, వేలుపుల పూఁవానలో • వెలసిమలసె.

సీ॥ తెగిన శిరంబు పై • నెగిరి పగరముస్నె, విలయ మారుతముచే • విఱిగి పడిన
పిడుగులు మెఱుపులు • వెడిదంబులగు రాల, మేఘమ్ముకైవడి • మేఘనాదు
నొడలు కూలముతోడఁ • బొడిచుకొన్నట్టియు, మ్ములతోడ బరువయి • పుడమిఁబడియె
దంష్ట్రలనెడు విధు • ద్వయముతో గురు శుక్ర, లను కుండలములతో • ఘన విశిష్ట
తే॥ కేశ పాశమనెడి రక్త • కిరణవితతి, తోడ రవిమండలము కాల • ధూతమగుచు
ధరణి కొఱఁగిన తెఱఁగునఁ • దనరి వాని, తలయు దబ్బునఁ బడియె ను • ద్దండభంగి.

ఉ॥ జీవుఁడు దేహ సంస్థితిని • చెందక యవ్వలి కేగినంత నా
త్రోవనె యంతరింద్రియ త • తుల్ చనుకైవడి రాక్షసావళుల్
రావణి కూలునంత సను • రక్తి నాయుధరాజి పీడుచున్
ద్రోవ యెఱుంగ రాక పలు • త్రోవలఁబోయెను దిక్కు తోఁపమిన్.

శా॥ అస్త్రాభ్యాస విశారదుండయిన హ • ర్యక్షారి యుక్కాఱఁగా
నిస్త్రింశంబగు దైత్యపాలనము వ • స్నెల్ మాసె నంచార్చుచున్
వస్త్రంబుల్ వెస పీచుచున్ సురలు పై • పశ్యంబునన్ బ్రేమమన్
శస్త్రం బూనిన జైనదేవతల యో • జం బూని రప్పట్టనన్.

మ॥ అరవిందాసనుఁడున్ మహే శ్వరుఁడు కం • జాక్షుండు నింద్రాది ని
ర్జరులున్ దిక్కు మొగంబుగాక సిరవ • ర్గంబుల్ వనాటావళుల్
పెరిమం జూడఁగఁ జాలకాలము నభో • వీథిన్ మనో మోద సం
భరిత ప్రేమను నిల్చినారలు మహా • పర్వంబు సంధించుచున్.

మ॥ అనిలో రావణిచే నిశాచరులచే • నంత్యస్థితిం బొంది మా
లిన కీశావలులెల్ల జీవముల నో • లిం గాంచి పూర్వంబు కం
టెను సత్త్వం బొదవంగలేచిరి విరా • డ్గేయాను కంపాప్తి స
ద్గుణులం బీడ లలంపవన్న సుజనో • క్తుల్ కల్లలౌనే ధరన్ ?

తే॥ అసుర తలగొని ముందుగ • నంగదుండు, జరగె వేలుపు లొత్తుగఁ • జల్లుచున్న
విరుల పందిరిక్రింద వా • నరుల నడుమ, హనుమపైఁ జనె సౌమిత్రి • యన్నకడకు.

క॥ పొనుపడు ఖేదంబును మఱి, పెనుపడు మోదంబు గలుగు • పృథ్వీపతి సం
తసపడఁ గేలం దలఁగొని, మునుపడ నడచెంచు వాలి • పుత్త్రుఁ గనియెన్

క॥ చందురు కలఁకంబటె నా, కుం దనరిన నింద లొలఁగ • గురుతర కీర్తిం
జెందితి ధర్మము కరుణిం, పం దలఁగని కీడు రాని • భాగ్యముఁ గలదే ?

క॥ లంకాధిపతి కుమారు వి, శంకటగతి లక్ష్మణుండు • చంపఁగఁ గనమం
దంకించి శిరము దెచ్చితి, వింకే నెత్తితిని శిరము • నెనసితి జయమున్

సీ॥ వేలుపుల్ దలయెత్త • వేదముల్ తలయెత్త, ధర్మంబు తలయెత్తఁ • దపములెత్త
మఘవుండు తలయెత్త • మౌనులు తలయెత్త, సత్యంబు తలయెత్త • సత్త్వమెత్త
జగములు తలయెత్త • జనములు తలయెత్త, దయయును తలయెత్త • నయమునెత్తఁ
బ్రేమంబు తలయెత్త • నేమంబు తలయెత్త, శాంతియుఁ దలయెత్త • దాంతి యెత్త

తే॥ సత్పథంబులు తలయెత్తఁ, సాధులెత్త, ముక్తిచింతయుఁ దలయెత్తఁ బుణ్యమెత్త
నంగదా! తలదెచ్చితి • వధిక ముదము, హత్తినాఁడవు నేఁ దల • యెత్తననుచు.

ఉ॥ ఏమగునో యటంచును జ • యింపదె ధర్మమె యంచు లక్ష్మణ
స్వామియె గెల్చునంచు విసు • వాసముతోఁ దనరాక సంతత
ప్రేమను వేచు నాభరతు • వీఁకను తమ్మునిరాక వేచు నా
రాముఁడు కన్నులార నెదు • రం గనె డాయుచునున్న లక్ష్మణున్.

మ॥ పగవానిం దెగటార్చి వచ్చిన ప్రియ • భ్రాతన్ బ్రతీక్షించుచో
మిగులం గన్నుల రాలు నశ్రువులు నె • మ్మిన్ వచ్చెనో? నెమ్మదిం
బొగులన్ వచ్చెనొ? మోదధారలొకొ? యె • మ్మెల్ నీరుగాఁజేయు జా
లి గదింపన్ వెలివడ్డ ధారలొకొ? శీ • లింపన్ సుసాధ్యంబొకో?

శా॥ సంతోషామృతధారలున్ బ్రవిమలో • త్సాహంబు నుత్కంఠ వి
క్రాంత స్ఫూర్తి వెలుంగ సన్నిహితుఁడౌ • రామాంఘ్రి సాన్నిధ్యమం
దంత! ప్రీతి సమర్పణంబు సలిపెన్ • బ్రాణాంతమందైన ని
క్లాంతిం బొందని వీర లక్షణ విధా • క్రాంత ద్విషన్మత్తమున్.

మ॥ తలఁజూచున్ జయలక్ష్మిఁ దాల్చిన భుజా • స్తంభంబుఁ జూచున్ మహా
బలసూనుం బరికించు లక్ష్మణ ధను • ర్బాణంబులన్ గాంచు వే
ల్పుల చేష్టల్ దిలకించు లక్ష్మణుని తెం • పుం దేటి చూచున్ ముదా
కలనన్ మీఱిన రాముఁ డేమియు నెఱుం • గన్ లేక మౌగ్ధ్యంబునన్.

సీ॥ అసదృశుఁడును సుగు • ణాంభోధి రాముఁడు, తనపాదములకు వం • దన మొనర్చు
తమ్ముని కాలాంబు • దమును సంధ్యారాగ, మెనసిన చందాన • నిమ్ము మెఱయ
నీలాచలముమీఁద • బాలభాను మయూఖ, ములు ప్రసరించిన • పొలుపు వెలయ
తొమ్మున భుజమునఁ • గ్రమ్మిన రుధిర క, ణమ్ములు తనమేనఁ • బమ్మికొనగ

తే॥ గాఢముగఁ గౌఁగిలించి నా • కడకు జనక, పుత్త్రి వచ్చి చేరినదని • ముదము గాంచి
ధరణిఁ దమ్ములఁ గలుగు వా • దరుల కలుకఁ, దనెడు వాక్యంబు నెలకొల్పి • తయ్యనేఁడు.

తే॥ అనుచుఁ దమ్మునిస్నిగ్ధభుజముల • నలరుచున్న, తూణములఁ దీసిభుజ తను • త్రాణములను
విడిచి వ్రణముల మెల్లనఁ • దుడిచియొత్తి, శ్రమముపోకార్చి తాను మో • దము వహించె.

తే॥ పురుషపుంగవ! యీగెల్పు • పౌరయుటరయ, నీవలనఁగాదు హనుమంతు • నేర్పువలనఁ
గాదు దైవంబుచేఁ గాదు • కాదు నిజము, మన విభీషణుచే నని • వినుతిచేసె.

## 28. రావణ శోక పటలము (61)

తే॥ దరులు గిల రక్త జలధిని • దాఁటి దైత్య. దుఃఖసాగరమును దాఁటి • దూత లప్రదు
గుహను చొచ్చు మచ్చునఁ జెను • గోపురంపు. ద్వారమునఁ జొచ్చి రావణు • దరికిఁజను

క॥ ముంగిళ్లను నిలిచిన దై, త్యాంగన లతిదుఃఖజలధి • యడుగునఁబడి క్రుం
గంగని నేఁటికి లంకయె, క్రుంగె మహాంభోధి ననుచుఁ • బోయిరి దూతల్.

ఆ॥ పండ్లు నోరు మనసు • ప్రాణంబులును కాలుఁ, గేలు వడఁకుచుండ • గిలి కుదింప
నీకుమారకుండు • నేఁటికి లేఁడయ్యె. ననిరి చారు లాద • శాస్యుఁజేరి.

ఆ॥ అచట నుండినట్టి • యమరులు నమర మా, నినులుఁ దిక్కువారు • నేఁడు జగమె
నాశమందు ననుచు • నడుఁకుచు దెసలకుఁ, బఱుగులిడిరి పంక్తి • వదనుఁ బాసి.

ఆ॥ కినుకఁ గనులనుండి • కీర్తి కణంబులు, గాల నుఱిమిచూచి • రావణుండు
కత్తిదూసి చరుల • కంఠముల్ తెగనేసి. కేలు వడఁక నేలఁ • గూలినాఁడు.

ఆ॥ పుత్త్రశోకవహ్ని • ముఖములఁ బుట్టి ని. శ్వాసమునఁ బెరింగి • చక్షులందు
వెలిఁగి దెసలఁ బరవి • విలయాగ్ని యే దశ. వదనుఁ జేరె ననఁగఁ • బ్రజ్వరిల్లె.

ఆ॥ ఒడలు వడఁకఁ బుడమిఁ • బడి యసలుటచేత, నవని శేషుఁ దదరి • యలుగులపడ
వెలలు కోపవహ్ని • వలన బాడబమె పై. కుబుక జలధి యుడుకు • నోజ నుడికె.

తే॥ తాపవహ్నియుఁ • బైపయిఁ • దనరు ప్రేమ, వనట యదరఁగ నిరవది • కనులనుండి
యురలు బాష్పప్రవాహంబు • కరఁగి యుబికి, పరవి పరుగిడు తామ్రముద్ర • వంబుఁబోలె

క॥ కటకటపడి రదనంబుల. బటపట గీఁటుచును పిడుగు • వలె బెడిదముగా
నటపటపడ నిం మో దెను. తటపటమని జీవకతి యె • దల్ సుడివడఁగన్.

ఉ॥ కాలిన పుంటిపైఁ గరఁగఁ • గాఁచిన శూలముఁ దూర్చినట్లుగాఁ
దాళఁగలేక క్రుక్కు వసు • ధంబడు సోలును లేచుఁ గ్రుఁగుఁ జిం
తాబ్ధిసుఁడై కలంగుఁ దన • యా! యను హా! యను విహ్వలించు నిం
కేల జగంబు జీవధన • మేగిన పిమ్మట దేహ మేలనుఁ.

ఉ॥ నాయన! యింత చెట్ట యగు • నా యను నింద్ర విరోధ ఓంతయే
నాయను నన్ను పీడఁబగు • నాయను వేల్పులు సంతసింపఁ జ
న్నాయను నేను విల్వ గల • నాయను శౌర్యము మంటిపాలు గా
నాయనుఁ బౌరుషం బడఁగె • నాయను జీవము పాసెనాయనున్.

క॥ శూలియుఁ గిలియు నవ్వన, మాలియు నెదిరింపలేక • ములఁగినవాటిల్
లీలగ హేంగ గేలిగ. మేలుగ విహరించువారు • మీఁద సువముసన్

క॥ ఖేచరుల విమానంబులు. గోచరమే కాకయుండుఁ • గోటి కొకండున్
నీచుల రణ విజయంబున. నేచెల! యీలంకమీఁద • నెగయవె యింకన్ •

క॥ దూతలు పలికిన తీరున, నాతుఱవ యొకండు తనుమ • నడఁగితివే ? నీ
చేఁతలనే తలపోయు కి, రాతులు యమదూత లెగచి • రా నిన్నలమన్ ?

తే॥ అనుచు లేచును నాయనా • యనుచుఁ బిలుచుఁ. బడును పలవించుఁ దూలును • పుడమిఁ బొరలు
నుడుకుఁ బరితపించుఁ జెమర్చు • నుటిమిచూచుఁ. గనులుమూయును లోలోనఁ • గళవళించు.

క॥ ఒక శిరము పుత్త్రికా ! యను, నొకశిర మిఁక రాజ్యభార • మోపుదునె కటా !
యకటా వికటంబగు నను, నొకశిర మరినోట నిన్ను • నుంచితినె ? యనున్.

క॥ ఒక శిరము పోయితే ! యను, మెకమొకటి మృగేంద్రుఁ జంపి • మించెనె యను వే
ఱొక శిరము రాఁగదే యను, సుకముగ నను తడవకున్న • స్రుక్కురుగ దనున్.

క॥ ఒకశిరము హరి గిరీశ. స్వకరాయుధములకు నపయ • శముగూర్చి వికా
సిక నవ్వు నీ మొగము చూ, పక పోయితె యింకఁ జూడఁ • బనుపదునె ? యనున్

క॥ ఒకశిరము నీవు చన్నఁ, గకవికయగు నామనంబు • కష్టించుచుఁ దో
డొకయింతలేక మలఁగును, సుకుమారా ! తండ్రిఁ దేర్పఁ • జూడవొకో ? యనున్

క॥ ఒక శిరము నిర్జరేంద్రుని, మకుటముఁ దివియంగ నంరి • మగువలు సుమముల్
ప్రకటించి చల్ల వెలసిన, మొకమును పొలికలనిఁ గాంతు • మో యని పొగులున్

క॥ ఒక శిరము యక్షవనితలు, వికట భవద్ఘోర రవంబు • విని తమతను కు
త్తుకలఁ గల సూత్రములఁ దడ, వికొనుట నిఁకమీఁద లేక • విహరింతు రనున్

క॥ ఒకశిర మపార బలద, ర్పక ! నీ సన్నిధికి వచ్చి • వైవస్వతుఁ డం
దిక నసువులు గొనఁజాలం, డిఁక నసువిడి యేజగమున • కేగితివో ! యనున్

క॥ అని యిటు పనవుచు రావణుఁ, డనిలజవంబునను సంజ • యాసమనఁగాఁ
జను పొలికలనికిఁ జని తన, తనయు కళేబరము నచటఁ • దడపంజొచ్చెన్.

క॥ సేవకులగు సుర లసురలు. రావణుతోఁ బయుగులిడిరి • రణరంగమునన్
భూవలయంబుఁ జరాభర. జీవవితతితోడ నేమి • సేయునో ? యనుచున్.

ఉ॥ కన్నునఁ బంక్తికంఠుఁ గని • దంక పిశాచ గణంబు లయ్యెడన్
ఖిన్నతనొందినట్లు పరి • కించి ప్రలాపముసేసెఁ గొన్ని పెన్
విన్ననమొందెఁ గొన్ని పల • వించి పదంబులఁ వ్రాలెఁ గొన్ని యా
పన్నతఁ గొన్నిచేరె శవ • వారణ కాయ నికాయ మధ్యమున్.

చ॥ కొడుకు కళేబరంబుఁ గనఁ • గోట్లకొలందిగఁ జచ్చి కుప్పలై
పడిన తురంగ సంఘముల • వారణవారములన్ భటాలి సం
గడముల శీర్ణమైన ఘన • గాంగ శతాంగములందు నంతటన్
గడఁకను త్రొచిత్రోచి పెప • దండొడఁగెన్ దినమెల్ల నయ్యెడన్.

మ॥ హృదయావేగము నేయిచే సదయుప • హ్నింబోలి వర్ధిల్ల నం
గదచేఁ గమ్మల సీదుపొంగి పొరలన్ • గ్రవ్యాదలోకేశుఁ డా
కదనక్షోణి బలిష్ఠ బాహ్వసియుతో • గ్రస్ఫార హీర ప్రభాం
గద విభ్రాజిత ఖండ దీప్త శిరముం గాంచె న్నెగుల్ దగ్గనన్

క॥ తూణీరము కేయూరము, బాణములును రాలిబంగఁ • బన్నగమువలెన్
రాణించు కరము స్వైరర, శ్రేణిం గిలించుకొనియె • జిత్తము తరలన్.

క॥ తుది నిశ్వాసము గల దశ, వదనుఁడు కంఠమునఁ గనుల • వక్షంబున నం
గదగొని యొత్తును మూర్కొను, బెదవులు చలియింప నేడ్చు • విలవిలవోవున్.

చ॥ పదపడి వాని మేనుగని • పట్టఁగరాని యలంత పెంపునన్
బెదవులమీఁది వక్షమునఁ • దీనుఁగుపైఁ బడ బాష్పవాహినుల్
పదరి శిరంబులేని కుడి • పంబును పట్టి పరిష్వజించి మై
యదరఁగ వెక్కి వెక్కి యల • యన్ విలపించు సురుంగు దూపిలున్.

చ॥ కొడుకు సురంబు నాటిన ల • కోరుల నూడ్చి యలంతి తుండ్లుగాఁ
జిడిముడి దీలుగా విఱుచుఁ • జింతిలు మూర్చిలు మేను మూర్కొనున్
దడవుఁ జలించు లేచు ఘన • సంబుల నొక్కట క్రుంగనెంచు న
ప్పుడమిని గూలు వంతి తల • మున్కలుగాఁ దపియించు క్రొమ్మపడున్.

శా॥ ఈదైత్యేంద్రుని యల్క రాఘవులతో • నే తీఱునో? బ్రహ్మరు
ద్రాదిత్యావలితోడఁ బోవునొకొ? లో • కాంతంబె కావించునో?
యేదారిం జనువారమంచు సుర మా • నీంద్రామిలెల్లన్ మనః
ఖేదోన్మాద విచేష్టితాంగులగుచున్ • గీ ప్రాటుమై నుండఁగన్

మ॥ దశకంఠుండు కుమారు శీర్షము సహో • ద్గాత్రన్ బరీక్షించి య
శ్రు కణముల్ దైకొనిపోయురంబు పెగచున్ • వక్షంబునం జేర్చుఁ బు
త్త్రాశయంబున్ మదిపుచ్చి పూయము పెలా • ర్పన్ మండుచున్ మాఁడుచున్
దశ లొక్కుమ్మడి బ్రద్దలై పగుల రో • దించుం భువిం దొల్లుచున్.

ఉ॥ దిక్కరులన్ గలంచి కడుఁ • దేలిక శంకర శైలమెత్తి పెం
పెక్క జగంబులం గెలిచి • యేపు వహించిన యేను నాసుతుం
డిక్కడ నేఁడు క్రుంగు నరుఁ • డెక్కటి కయ్యమునందు కూల్పఁగా
నక్కటి దీనతం గలఁగు • చుంటిని దిక్కటి ధిక్కరించుచున్.

చ॥ అలకను కాల్చి యింద్రపురి • యందము క్రమ్మలఁగ బొగ్గుచేసి యి
య్యల నెదురెందు లేక చరి • యించి జగంబుల నేలు నేరణ
స్థలిఁ దలఁ గోల్పడన్ చనువు • జంబుకముల్ గ్రసియింపఁ గూలు గా
దిలి సుతుఁ గాంచి యాపిదపఁ • దిన్నది కుక్కలకూడు నానొకో?

చ॥ కొమరునితోడ వచ్చిన య • కుంఠిత విక్రమశాలు లాజి దు
ర్దములగు రాక్షసుల్ సమర • రంగమునం దొకరేని లేక జీ
వములఁ ద్యజించినారు కపి • వర్గమునం దొకఁడేని చావఁడీ
క్రమము విచిత్రమయ్యె నని • కాంచుచు నూరకయుంటిఁ, జెల్ల రే!

మ॥ సుర గంధర్వ భుజంగ యక్ష హరిణా • క్షుల్ సిద్ధ సాధ్యాంగనల్
వర విద్యాధర కీరవాణులగు నీ • భార్యల్ ప్రలాపించుచున్
వరుఁడేడీ శివమేది చూపు డనుచుం • బ్రశ్నింపఁగా నంతకున్
దురమందోర్చిన యేను వారి నెటు గాం • తున్? బల్క నోరాడునే?

మ॥ జయలక్ష్మింగొని యింద్రసంపదల ని • చ్చం గోరినట్లెల్ల ని
శ్చయలీలం గొనిపొందితిం దుది మను • ష్యస్త్రీకి నొక్కర్తుకై
యయయో! నీవొనరింపఁగాఁ దగిన యం • త్యప్రక్రియల్ నీకు నే
నయి కావింపఁగఁజేసికొంటిఁగద క • ష్టాత్ముండ దౌర్భాగ్యుఁడన్.

చ॥ అని బహుభంగులం బనవి • యాత్మజు దేహము నెత్తి నెత్తిపైఁ
గొని దనుజాంగనల్ గదిసి • కొందలమందుచు నేడ్చుచుండ లం
కను వడిఁజేరెఁ గాంచిన ఖ • గంబులు నేడ్వఁగఁ బత్తనంబె నె
క్కొనినది యాలగోడుగను • గోలల గోడుగ బాల గోడుగన్.

చ॥ కనులఁ బెకల్చికొంచుఁ దమ • కంఠములన్ వడిఁ ద్రెంచికొంచుఁ గ్ర
న్నన హృదయంబుఁ జీల్చికొని • నాలుక లూడిచికొంచు శీర్షముల్
మొనసి పగిల్చికొం చసుర • పుత్త్రుని భార్యలు పన్వ రయ్యెడన్
మనసులు పండ్లుగా సయిఁపు • మాలి త్యజించిరి ప్రాణవర్గమున్.

శా॥ తండ్రీ! యంచును దానవాంగనలు నా • థా! యంచు దైత్యేంద్రుకో
డండ్రుం గుంపులుగూడి కట్టుకొని యే • డ్వం దక్క చెల్లెండ్రు ని
ల్లాండ్రుం బిడ్డలు జీవితాశలను రో • యన్ గుంపులై వచ్చి రె
వ్వాండ్రుం జూడఁగఁ దెచ్చె సంతిపురికిం • బౌలస్త్యుఁ దమ్యోందెమున్.

సీ॥ పుట్టకోపలఁ బన్న • ములు మోఁదుపగిది ను. రమ్ముఁ గరమ్ములఁ • గ్రుమ్మికొనుచు
రశనను మోవనే • రని సన్న కౌను పా. లిండ్ల భారమ్మున • నింత్రపడఁగ
ముడివీడి వేనలి • మడమలఁ దడవంగఁ, గన్నీరు మున్నీరు • గాఁగ నలమ
విప్పు ద్రొక్కెసగతి • నేలఁ బదములానఁ, బుత్త్రదుఃఖము పొంగి • పొరలి ముంప

తే॥ మృగయుశరభిన్న హృదయయై • మేదినీధ్ర. మందుపొరలు మయూరినాఁ • గొందలించి
కొడుకు మేనిపైఁ బ్రాణముల్ • కుతిలపడఁగ. వ్రాలి మందోదరి ఘనంబు • తూలసోలె.

తే॥ కొంత సేపు తెలివిదక్కి • కూలియుండెఁ. గొంత సేపు నిశ్చేష్టయై • కూడుచుండెఁ
గొంత సేపు మౌనంబునఁ • గుందుచుండెఁ, గొంత సేపు వెక్కుచుఁ బల్క • కుదురకుండె

చ॥ తరుణి శకుంతుఁబోలెఁ బ్రియ • దంబుగ వర్తిలినాఁడె వాసవున్
గరువమడంచి తెచ్చుటను • గాంచఁగ నోచిన యేను మొండెమున్
బరువుగఁ జూడఁ దాల్పడితిఁ • బాపకలంకిత చిత్తఁ గావునన్
మురువగు నీదు మోము గను • పుణ్యము నింతయు నోచనైతిగా

ఉ॥ చక్రిని శంకరుం జెనకి • సంకట పెట్టితి వల్లనాఁడె యో
ర్విక్రమవర్య! నీయెడరు • విన్ననువొప్పు మొగంబుఁ జూడకే
శక్రభయంకరా! మసఁగఁ • జాలుదునయ్య! యనంగరూప! నే
నీక్రియ నీదుమాత నని • యెత్తఱి నొందుట దీనిఁ జూడనే?

ఉ॥ కాళుల గల్లుగల్లుమని • గజ్జెలు మ్రోయఁ జరించునాఁడె సిం
గాలను పట్టి యాడ్చికొని • కాటియవెట్టుచు మేద మ[illegible]
లీలగఁ గట్టివైచి పలు • లీలలఁ దేలుచు నుంటఁ జూడఁగాఁ
జాలుదునయ్య! యింక మరు • జన్మము నెత్తిన నోము నోచినన్.

ఉ॥ హస్తముచాఁచి పిల్వఁగ శ • శాంకుఁడు భీతిలి వచ్చి నిల్వ నీ
శస్త్రకరంబుతో నతనిఁ • జల్లగ దువ్వుచు భీతి మాన్చి సం
ప్రస్తుతమౌ కలంకముఁ గు • రంగముగాఁ దలపోసి పట్టఁగా
నిస్తుల హస్తముం బఱపు • నీటు గనుంగొన నెంతు రాఁగదే!

చ॥ స్కందునకట్టి సుందరు ని • శాచర పన్నగ యక్ష దేవ శి
తేందు ముఖుల్ విలాసముల • హేలల లోఁగొననెంచి పుష్పశ
య్యం బఱివేచి విశ్రమ • మంది సుఖంబుగ నిద్రసెందితో?
క్రందగు కయ్యమం దొనరు • క్లాంతి తొలంగఁగ విశ్రమించితో?

క॥ ముల్లోకంబుల గెలిచిన, బల్లిదుఁడగు సుతుఁడు నేడు • బవరంబున ని
ఘెల్లిదుఁడగు నొక మానవు, భల్లంబునఁ దెగియె నకట! పాపపు విధిచే.

ఉ॥ దూది హుతాశిలో వలెనె • దుర్దమ మానవ బాణ వహ్నిఁ బ్ర
వ్యాదులు చన్నవారు చని • నట్టుల చచ్చెడువార క్రమ్మఱన్
లేదొకప్రాణియైనఁ గబ • శించె దశాస్యుఁడు ధాత్రిజాత యన్
స్వాదు విషంబు రేపటికి • సాధ్యమె యిట్టులు కాక తక్కఁగన్?

మ॥ మది సంతాపము పిల్లు వెల్వలచు న • మ్మందోదరిం బ్రవ్యథ
క్కృదతుల్ చేతులమీఁద నెత్తుకొనుచున్ • ఖడ్గాంతమున్ జేర నం
గద వర్తిల్లఁగ రాతిగుండెగల యా • క్ష్మాజాతయే హేతువౌఁ
గదయం చుగ్రగతి న్వధింపఁ జనె లం • కానాథుఁ డత్యార్భటిన్

మ॥ పరుగుల్ వాఱుచునున్న రావణుని భా • వంబుల్ విమర్శించి ని
ల్వరమౌ కీర్తి నశించునే యనుచుఁ ద్రో • వన్ దెంపు తోడన్ మహో

దరుఁ దర్పంబయి చాఁగిలంబడి యనున్ • దైత్యేంద్ర! కోపంబుచే
స్థిర కీర్తిం గొనిపోయి గంగఁ గలపం • జింతించెదే తొందరన్?

ఉ॥ కీరితి మొత్తముం భువన • గేయముగాఁ గొను రాక్షసేశ్వరా!
కోరితి లోకనాయకత • గొంటివి కోరిన కోర్కె చెల్లఁగన్
జేరితి చెంపరాని సుర • సిద్ధ పదంబులఁ బల్మి పెంపునన్
మీఱితి వెల్లభోగముల • మేకొనెదేలఁ స్థిరావనిందకున్?

మ॥ సురసంఘంబులపై దిగీశ్వరులపై • సుత్రాముపై వాలిపై
వర దిగ్వారణరాజిపై ధనదుపై • వర్తిల్లు యుష్మచ్ఛరా
చర భీతిప్రద చంద్రహాస మొక కం • జాతాక్షిఁ దుండింపఁగాఁ
బరపన్ సిగ్గిలి క్రుంగుఁగాక పనితా • ప్రాణంబులం గ్రోలునే?

మ॥ అబలన్ గోల లతాంతకోమల ససూ • ర్యంపశ్య వైదేహిఁ గో
ప బల స్ఫూర్తి గడల్కొనం దునుముచో • బ్రహ్మాదు లింద్రాదు ల
ల్పబలుం డల్పగుణుండు నీచకులుఁడున్ • వ్రాత్యుండు భీతుండు మా
న బల స్థైర్య విహీనుఁడం చనరు లం • టం గేలి గావింపరే?

ఉ॥ కాదిది రాజనీతియును • కాదు సురారి! ధర్మరీతియున్
గాదిది సాధుపద్ధతియుఁ • గాదు జయాంకము కాదు మోచమున్
గాదిది యిష్టసిద్ధియును • కాదిది మేలియు విక్రమస్థితిం
గాదు పులస్త్యవంశ్య! కొఱ • గాని యపప్రథఁ దెచ్చికొందువే?

ఉ॥ రాముని కత్తితో నఱకి • రాముని వెండి జయించి లంకకున్
రా మతియించెదో? చెలువ • ద్రుంచిన, వారలు చింతతోడ సం
గ్రామము మానువారలను • కారణమో? యది వీరధర్మమో?
రాముని గెల్వలేకుడిగి • రాక్షసరాజను గోసు మోసెదో?.

ఉ॥ నావుడు రావణుండు బల • నన్ వధియించుట మాని రోసి వా
లావులఁ బాఱవైచి తన • యక్కలి పుత్త్రి శిరంబుతోడ రా
జీవవినోది వంశజుల • శీర్షములన్ గొని కాక క్రమ్మఱన్
రావణి గాత్ర మందనుక • రంగఱ కుంచుఁడి తైలమందు నిడెన్.

## 29. సేనా సందర్శన పటలము. (72)

చ॥ కొదుకు శవంబుఁ దైలమున • గుప్తి యొనర్చిరి దైత్యవైద్యుల
య్యెడ దెసలెల్ల నిండి వసి • యించుచు నుండిన రాక్షసావలిన్
గడుకొని పిల్వఁగాఁ జనిన • కర్బురదూతలు వచ్చి లంకలో
నెడ మొకయింత నిల్పుటకు • నేని కనంబడ దయ్యె నాథుడున్.

ఉ॥ ఎచ్చటనున్నవంటు దను • జేశుఁడు ప్రశ్నయొనర్ప దేవరా!
అచ్చుపడంగ నింతె కల • దంచు వచించుట కెట్లుచెల్లు? వా
తోచ్చలి శాంబుధిప్రాకా • ముల్బణమంద జగంబు చాల కు
న్న ప్పున్న నెల్లెడం బరవి • యార్చుచునున్నది సేన మత్ప్రభూ!

క॥ పదరజము నిండి యంబర. పడముసఁ గాలూని విబుధ • వర్యులు నడవన్
గదిరిచి మితిమీఱిన మన. చదలము గిన నరుదుగాఁగఁ • జనుదెంచె విభూ!

సీ॥ కత్తులు మెఱుపుల • కరణిఁ బ్రకాశింప. మేఘసందోహంబు • మెఱయమానె
భేరీ రవమునకు • మాఱొడ్డి జలదముల్. చెలఁగి యెక్కడను గ • ర్జింపవయ్యె
నా సేనవలె నల్ల • నై యుండలేమి ఱీ. మూతముల్ వెల్లనై • ముడిఁగి మొదిఁగెఁ
జతురంగ బలమెల్ల • జలధిపై నడతెంచె. నన నొక యుపమాన • మరయఁగలదె?

తే॥ బలము మితిమీఱి పైపయిఁ • బరవుచుండ, నూర్ధ్వజగము లొండొంటిలో • నొదిఁగితూతెఁ
జంద్ర తారకల్ నెలవుల • జాఱ విడిచెఁ, దరణి పథిలేక తనత్రోవ • దాఁటి చనియె.

చ॥ గగనము ముట్టి మేరుగిరి • కైవడి వెగ్గుచుఁ దీసియున్న నా
ల్గ గవఁకులందు చొచ్చిన య • కుంఠిత సైన్యముచూడఁ గాలఁదే
జగము ధరింపఁజాలదని • సాగరసప్తకమున్ మతొక్కచో
మొగపడి పేర్చుచుండె నన • బొల్చ వహించి రహించె నయ్యెడన్.

చ॥ గవఁకులయంద యిక్కటము • గాఁ జొరఁగాఁ దడవౌన యంచు దా
నవ బలముల్ విలంఘన మొ • నర్చుచుఁ గోటను దాఁటె నన్నఁ దాఁ
దవిలి పయోధి సప్తకము • ధారణి నొక్కటఁ జూడఁగోరు మా
నవుపలె నెల్ల సేనలు గ • నంబడ గోపుర మెక్కెఁ జూడఁగన్.

మ॥ పరమార్థంబును విస్తరించి నిగమ • వ్రాతంబు భాషించు పై
ఖరి దూతల్ విభజించి పల్కి రొక ది • గ్భాగంబునందుండి యే
ద్దెల వేఱొక్క పలంకుదాఁకఁ బరిపూ • ర్తిం బొందు సంద్రంబునాఁ
బఱపైనట్టి చమూ సమూహముల నా • పౌలస్త్యుతో నిమ్మగన్.

ఉత్సా॥ వీరు పేఁకుదీవివారు • వేల్మిఁ బుట్టినారు బృం
దారకులను మోహజలధిఁ • దార్చి ముంచినారు పై
వారివములఁ దాఁకు నంత • వారు మేని పొడవునం
దారి శేటినారు మాయ • నార్చు సంగరంబులన్.

ఉత్సా॥ వీరు దబ్బదీవివారు • విక్రమమున నంతకుం
గేరువారు విజయలక్ష్మిఁ • గేలఁబట్టువార లీ

వీరివలన స్వర్గలక్ష్మి • వీడినారు వేలుపుల్
శూరవరులు సమరమందు • శూలికేని యోడరున్.

ఉత్సా॥ వీరు బూరుగనెడు దీవి • వెలయువారు వాసవున్
బోరఁ గెలిచి పాకవైరి • పురము కొల్లగొట్టినా
రార భవుని వరబలమున • నధిక సత్త్వ గౌరవుల్
కారుచిచ్చువంటి కినుక • కసలు గల్గు వారలున్.

ఉత్సా॥ వీరు క్రౌంచదీవివారు • పేల్చు రాజయాచియా
మేరువును సముద్రమందు • ముంచి త్రోయఁబూనఁ బా
కారి మొదలుగాఁగ నమరు • లదరి బెదరి వీరలం
జేరి వేఁడికొనుచు నట్టి • చేఁత మాన్పి రొక్కెడన్.

తే॥ వీరలు ప్రవాళగిరి నుండు • వారు శుక్రు, నికి నిశాచరాంగనకు జ • నించినారు
కలశ వారాశి వరటిపోఁ • గలఁచినారు, బలము పదికోట్లు లెక్కకుఁ • గలుగువారు.

తే॥ వీరు చిలుగాలి సతతంబు • వీచుచుండు, గంధమాదన వాసంబు • గలుగువారు
హాలహలమున కిరులకు • నన్నలనఁగ, నొప్పువారు లెక్కకు మీఱి • యుండువారు.

తే॥ మలయమను గొప్ప మల జల • మధ్యమందు, గలదు వీరలందలివారు • నలువ వీరి
వలన జగములు నశియింపఁ • గలవటంచుఁ, దలఁచి ప్రార్థించి యచ్చోట • నిలిపినాఁడు.

తే॥ వీరు సప్తాంబుధుల కధి • కారులైన, పుష్కరదీప్వవాసులు • భూరి బలులు
సమ్మెటలు శూలములు గదల్ • చక్రములు ము, సుండులును విండ్లు ధరియించి • యుండువారు

తే॥ వీరు జావ్విదీని కల • వారలు తమ, తల్లి పనుపున ధరణి • దాఁటి చక్ర
వాళగిరియందు జముఁగెల్చి • బంధనమున, వైచి నలువ కోరికపయి • వదలినారు.

తే॥ మీరు పసియించ నపని వి • స్తారమైన, చోటులేదు పాతాళంబుఁ • జొరుఁడి యని వి
రించి పంపఁగ నందుండి • ప్రేమచేత, వచ్చు బేతాళహస్తులౌ • వారు వీరు.

తే॥ నిర్మలివంశజుల్ వీరలు • నీకు హితులు, సురటతో నుండి త్రావనె • త్తురులు లేమ
విసిగి వచ్చిరి సప్తప్ర • ధ్వీధరములు, నెత్తువా రంబుధులఁ ద్రా • వనెసఁగువారు.

ఉ॥ వీరలు తొల్లి క్రోధమయి • వెన్నుఁడు కోఁజల నెత్తునంత నీ
ధరణి మోహముంగొను క • తంబున జాఱిన శోణితంబు బం
గారముగాఁగ దానిఁగొని • క్రచ్చులఁజేసిన వీరముంటికల్
సౌరుగఁ దాల్చి రష్టదిశ • లన్ దమ గౌరుల నిల్పినారలున్.

క॥ ఈక్రవ్యాదులు భూరి ప, రాక్రమమునఁ గొలఁతలేక • రాజిలుదురు పా
దక్రాంతి శేషుఁడును ని, ద్రాక్రమమును వీడి యయ్యెఁ • గ్రాలెడువారల్.

